ఓంతత్సత్

# పీ ఠి క.

—••••—

శ్రీమాన్ బ్రహ్మవిద్యావిశారదులును పరిపూర్ణహంస యోగానందులును శ్రీలక్ష్మణాచార్య పాదారవింద సేవా నిరంత రుండును తాడిపత్రి తాలూకాలో నిరంతరానందకరంబగు ధనధాన్యభోగభాగ్య సంభరితంబైన తేరన్నపల్లె వాస్తవ్యులగు కమ్మకులవిలసితులును సుంచువంశపయఃపారావార రాకాసుధా కరుండును పరిపూర్ణసుధాకరాభంబగు యశోవిశాలురను యగు కొండయ్యనామధేయ యర్ధాంగలక్ష్మియగు యశ్వోత్థ మాంబ గర్భశుక్తి ముక్తాఫలుండగు వేంకటరామయోగి ప్రణీతంబైన హంసయోగశతకము.

శ్రీముక్తికాంతా మనోహరులగు సాధుసత్పురుషులారా సద్గురు స్వామిపరిపూర్ణకృపారసంబునను పెద్దలైన మహాభోటి మహాత్ముల యాశీర్వాదబలంబునను నేనీచిన్న తేటగీత శతకంబు రచియించితిని పరిపూర్ణజ్ఞానులు యజ్ఞానాంధకారంబునువదలి సత్యజ్ఞానానందంబుననుభవించి యానందించినటుల నాకించి జ్ఞత్వంబున రచియించిన యీ శతకమున దలి దోషంబులను పరిహరించి సువిషయంబులనుగ్రహించి సంతసించి నన్ననుగ్రహించెదరని తమదాసుడనై ప్రార్థించెద.

ఓం తత్సత్
శ్రీలక్ష్మణ సద్గురు చరణారవిందాభ్యాంనమః
శ్రీసాధుసజ్జన చరణారవిందాభ్యాంనమః

# హంసయోగశతకము.

---

క॥ శ్రీయోగీశ్వర సద్గురు
రాయామీచరణయుగళ రాజీవంబుల్
హాయిగ నిల్పుము నా హృ
ద్గేయంబున నిత్య సత్యధీరనికాయా 1

తే॥ లక్ష్మణాచార్యుడీకృతి లక్ష్మికెపుడు
పతియుగానుండి రక్షించు భద్రకృపను
భువినియా చంద్రతారార్కముగను వెలయు
రమ్యతరభోగి వేంకటరామయోగి 2

తే భోగభాగ్యంబులకు నాకపురము దగును
మాధవునిభక్తి గల్గిన మనుజులచట
జగతి తేరన్నపల్లెకు సాటిగలదె
రమ్యతరభోగి వేంకటరామయోగి 3

తే॥ కమ్మకులసుధాబ్ధిపూర్ణకమలవైరి
నుంచుకొండయ్య యర్ధాంగి సుగుణఖనియు
నైనయాశ్వత్థమాంబకు నగ్రసుతుడ
రమ్యతరభోగి వేంకటరామయోగి 4

తే॥ సద్గురుస్వామిదయతోడ సంగ్రహముగ
విమలవేదాంతయంశంబువి బుధసమితి
కరుణ తేటగీతలు జెప్పగడగినాడ
రమ్యతరభోగి వేంకటరామయోగి 5

తే॥ తప్పు లేనట్టిమనుజుడే ధరణి లేడు
యతులితరుల తప్పు లేయరయుచుంద్రు
యిలనుగురి వెందలెననల్ప నెరుగగలదె
రమ్యతరభోగి వేంకటరామయోగి 6

తే॥ భావమారసిసుజ్ఞాని ప్రస్తుతించు
దోషలేశంబె గని పెంచు మూర్ఖుండు
కుక్క నీచపుశల్యముల్ కోరి వెదకు
రమ్యతరభోగి వేంకటరామయోగి 7

తే॥ మాయతంత్రంబులో జిక్కి మానుజీవి
గర్భనరకంపువారాశి గడువలేక
దైవమాత్రోపమంచును దండమిడును
రమ్యతరభోగి వేంకటరామయోగి 8

తే॥ మానసవశంబు గడువగారోసిరోసి
జననిగర్భంబులోనుండి జననమొంది
బాల్యలీలలజూపించు భ్రాంతుడగుచు
రమ్యతరభోగి వేంకటరామయోగి 9

తే॥ కామదుప్రాయంబు నరుదెరకామలులను
గనినమూరుఁకోలల గడువలేక
పడతిమోహంపు పంజరపక్షియగును
రమ్యతరభోగి వేంకటరామయోగి 10

తే॥ భార్యబిడ్డలధనధాన్య భ్రాంతినొంది
దిక్కు దోచక కాలంబు దెలియలేక
కుక్కరీతిగ దిరుగాడి కూలఁబడును
రమ్యతరభోగి వేంకటరామయోగి 11

తే॥ యిటులజన్మంబులెన్నియో యెత్తియెత్తి
యొకటపరిశుద్ధిగానక నొరలిజీవి
జననకర్మాబ్ధిగడువగా జాలకుండు
రమ్యతరభోగి వేంకటరామయోగి 12

తే॥ చనినజన్మాళిగణుతింపజాలు నెవడు
వచ్చుదేహంబులెన్నడు వారలెవరు
జీవియెన్నడు ముక్తినిజెందునొక్కొ
రమ్యతరభోగి వేంకటరామయోగి 13

తే॥ తనువునాదంచుమూర్ఖుండు దలచితలచి
ప్రతిదినంబును పోషించుభ్రాంతినొంది
జీవివిడనాడతనువిందు జేయుటేమి
రమ్యతరభోగి వేంకటరామయోగి 14

తే॥ గర్భగోళంబులో గ్రోతగానలేక
పునుగుకస్తూరి యుత్తరుబూతునేమిం
కనకవస్త్రంబు ధరియింపఘనతగను న
రమ్యతరభోగి వేంకటరామయోగి 15

తే॥ జలమునందలిబుద్బుద సమముతనువు
దీనిగాకడపోకడ తెలియుతరమె
శివునకైనను శారదాధవునకైన
రమ్యతరభోగి వేంకటరామయోగి 16

తే॥ ఎచటనుండియువచ్చెనో యెటకుజనునో
యిచటయెన్నాళ్లుయుండునో యెరుగవశమె
యింతమాత్రంబునకు గర్వమేలనయ్య
రమ్యతరభోగి వేంకటరామయోగి 17

తే॥ ఎమునిపురిలోనినరకంబు నెక్కువండ్రు
దానినెట్లైనసైరించి దాటవచ్చు
గానిగర్భనరకమెట్లు గడువవచ్చు
రమ్యతరభోగి వేంకటరామయోగి 18

తే॥ అమరశైలంబుచేపట్టి యాడవచ్చు
మెరయుఘోరానలంబును మ్రింగవచ్చు
గానిసంసారవారాశి గడువతరమె
రమ్యతరభోగి వేంకటరామయోగి 19

తే॥ మునుఁగుమూర్ఖులు సంసారమోహజలధి
మునిగి తేలుచున్నారు మూఢులెటుల
దాటికడతేఁగలరో యీధరణి యందు
రమ్యతరభోగి వేంకటరామయోగి 20

తే॥ తల్లిదండ్రులు భార్యలు తనయులరయ
వచ్చుజన్మాననే వర్సనారలౌకొ
యిట్టిసంబంధమజుఁడెట్లు బెట్టెనకట
రమ్యతరభోగి వేంకటరామయోగి 21

తే॥ పాయు దెన్నఁడు మనపూర్వప్రాప్తధనము
లేనియప్రాప్యసౌఖ్యంబు రానెగాదు
యింతకై యింత భ్రాంతినీకేలనయ్య
రమ్యతరభోగి వేంకటరామయోగి 22

తే॥ మూత్రమలముల మాంసాదిముఱికిసంచి
రోగములదుంప శల్యాదిరోతకొంప
యింతనీచపుతనువుపై భ్రాంతియేల
రమ్యతరభోగి వేంకటరామయోగి 23

తే॥ వచ్చునప్పుడు దెచ్చిన వస్తువేది
పోవునప్పుడు గొంపోవుపోక యేది
మధ్యవచ్చినవాటిపై మమత యేల
రమ్యతరభోగి వేంకటరామయోగి 24

తే॥ తనువునిల్వదు వెయ్యేండ్లుధరణిమీద
ధనములస్థిరమగుగాదె దాచనేల
భూములిండ్లనువిడనాడి పోవవలదె
రమ్యతరభోగి వేంకటరామయోగి 25

తే॥ గొప్పభూపాలుఁయాశను జెప్పతరమె
భిక్షుగానికి బహుయాశ పెరుగుచుండు
యాశకును మేరలేదెందు నవనియందు
రమ్యతరభోగి వేంకటరామయోగి 26

తే॥ త్రేనెబూసినఖడ్గముల్ మానవతులు
మోహజలరాశిలోఁద్రోచి ముంచివైచు
బోటిపై భ్రాంతివిడనాడ మేటియతడు
రమ్యతరభోగి వేంకటరామయోగి 27

తే॥ ఎండమావులసమములై యుండుధనము
సంపదావళిపరికింప స్వప్నమగును
గగనపుష్పంబు లరయంగమగుపసుతులు
రమ్యతరభోగి వేంకటరామయోగి 28

తే॥ ఘోరవిపినంబు సమముసంసారమరయ
వన్యమృగములవలె మనవారలెపుడు
తెమ్మువస్తువులనుచు బాధించుచుంద్రు
రమ్యతరభోగి వేంకటరామయోగి 29

తే॥ మెరయుచునలంబుగని దూఁకుమిడుతరీతి
భార్యబిడ్డల మిత్రుల బాంధవులను
నమ్మిముదమందివిడనాడు నరుడుసుమ్మి
రమ్యతరభోగి వేంకటరామయోగి 30

తే॥ ధనము పెంచంగ దాచంగ తిరుగుచుండ
నష్టచోటుల సంశయంబాదునరుడు
గానకాంచనమది దుఃఖకరముగాదె
రమ్యతరభోగి వేంకటరామయోగి 31

తే॥ ముదిసెగోమాళిదంతముల్ ముదిసెతనువు
ముదిమిలేకను వృద్ధినిబొందురేడు
విషయభ్రాంతియు బ్రదుకుపై విపులయాశ
రమ్యతరభోగి వేంకటరామయోగి 32

తే॥ కష్టయాహారమునకునై గోచియుండి
తన్నుమ్రింగెడి సర్పముఁ దలపనటుల
ముందుయాలోచనలో గూలుమూఢజనుడు
రమ్యతరభోగి వేంకటరామయోగి 33

తే॥ గెలుచుకార్యంబు తనదంచుదలచుజడుడు
తప్పిపోయినహరికృప దప్పెనంద్రు
యిట్టిపామరజనులకు యేమిగతియొ
రమ్యతరభోగి వేంకటరామయోగి 34

తే॥ దిక్కులేనట్టివారికి దేవుడుండ
ధనమదాంధులజేరంగ తగదుజ్ఞాని
ఫలముగల్గునెమిక్కిలి బాధగాక
రమ్యతరభోగి వేంకటరామయోగి 35

తే॥ చెనటితొల్లియు ధర్మంబుజేయకుండి
యిపుడుభాగ్యంబులేదన్న నేమిఫలము
విత్తమరచియు కోయంగ వెదకినట్లు
రమ్యతరభోగి వేంకటరామయోగి 36

తే॥ తొల్లియొనరించు పాపంబుతొలగిపోదు
యకట మాండవ్యుడేరీతి యనుభవించె
నరులమోసంబుజేసిన హానియులేదె
రమ్యతరభోగి వేంకటరామయోగి 37

తే॥ మాధవునుతించునాతడే మనుజుడగును
శివునిపూజించు హస్తముల్ శ్రేష్టమగును
యేమిజేయని మానవుండిలను పశువు
రమ్యతరభోగి వేంకటరామయోగి 38

తే॥ భక్తప్రహ్లాదుబాధించి శక్తిదూలి
రణధరాస్థలిగూలడే రాక్షసుండు
సాధువుల బాధనొనరింప జనమునరులు
రమ్యతరభోగి వేంకటరామయోగి 39

తే॥ మాయవాదులనీచవు మంత్రసమితి
శౌరిభక్తులబాధింప జాలవయ్య
యిలనుప్రళయాగ్నిముందర శలభమటుల
రమ్యతరభోగి వేంకటరామయోగి 40

తే॥ ఈశభక్తుల స్నేహంబు నెపుడు జేయ
పాపసంఘంబులెల్లను బాఱిపోవు
భాస్కరునిజూచితిమిరంబు బాఱినట్లు
రమ్యతరభోగి వేంకటరామయోగి 41

తే॥ రత్నములు భూమిలోబుట్టురాళ్లుగాదె
పుడమియేతోన్నియేండ్లకు బోవుచుండ
కనకరత్నంబులనుగోరు కాంతులేల
రమ్యతరభోగి వేంకటరామయోగి 42

తే॥ వటువుగల్గిన వజ్రంబు వదలినరుడు
గాజుపెంకును రత్నంబుగాదలంచు
జ్ఞానభాస్కరు విడనాడి హీనులైరి
రమ్యతరభోగి వేంకటరామయోగి 43

తే॥ కులముగోత్రంబు లెన్నుచునోనుగనేల
తోలుతిత్తికిబుట్టిన దొడ్డకులము
తండ్రిబీజంబెనరులకు తగినకులము
రమ్యతరభోగి వేంకటరామయోగి 44

తే॥ తద్దినంబేదమునుబోవు తండ్రియేడ
దేంహామునవీను మాత్రమే తిరిగిబుట్టు
నిట్టియవివేక కార్యంబులేలనయ్య
రమ్యతరభోగి వేంకటరామయోగి 45

తే॥ తండ్రిపేరట సుతుడీడదానమియ్య
యాఫలంబును తమయయ్యనందుకొనునొ
యొరులుభుజియింప తానెట్లులొందుతృప్తి
రమ్యతరభోగి వేంకటరామయోగి 46

తే॥ బలముగలదంబు పెద్దలపరిహాసింప
తొల్లియుండినసంపదల్ దూలిపోయి
దొడ్డదురితాత్ముడై చాలదుఃఖమొందు
రమ్యతరభోగి వేంకటరామయోగి 47

తే॥ దైవదూషణమొనరించు తామసుండు
కోట్లజన్మంబులొందితా గోడుచెందు
నట్టి దురితాత్మునకు సాయమువనిగలదె
రమ్యతరభోగి వేంకటరామయోగి 48

తే॥ శారీకపకారమొనరింప సైచుగాని
సాధువులకెగ్గుజేసిన సైపడయ్య
సాధుహృదయంబులందు తాసంచరించు
రమ్యతరభోగి వేంకటరామయోగి 49

తే॥ తాను సౌఖ్యంబు నొందంగదలచిజడుడు
యితర గాత్రంబుల లయించుహీనుడరయ
ఘోరనరకాబ్ధిలోబడి కూలుగాదె
రమ్యతరభోగి వేంకటరామయోగి 50

తే॥ తాను చేసిన నేరముల్ దాచుకొనియు
పరులదోషంబులెన్నును పామరుండు
యినునినలుసులతిమిరంబు లెంచినటుల
రమ్యతరభోగి వేంకటరామయోగి 51

తే॥ నరునిఛాయయు తనవెంటనరుగుకరణి
తాను జేసినయఘములు తలగకెపుడు
బాధలొనరించుచును వెంటబడునుగాదె
రమ్యతరభోగి వేంకటరామయోగి 52

తే॥ చటులమోహాంపు సంసారసాగరంబు
గడువవచ్చునె సద్గురు కరుణలేక
తగినయోడయు లేకబ్ధిదాటుటెట్లు
రమ్యతరభోగి వేంకటరామయోగి 53

తే॥ మాయకాసులు నియ్యంగమనసుకాదు
జన్మకర్మాబ్ధిదాటించు జ్ఞానరత్న
మెటులదేశికు డిచ్చునిస్సారగుదాక
రమ్యతరభోగి వేంకటరామయోగి 54

తే॥ అలచతుర్విధశుశ్రూష లాచరించి
పరమసద్గురు దయకెంతొ పాత్రుడైన
దేశికేంద్రుండు తనయుపదేశమొసగు
రమ్యతరభోగి వేంకటరామయోగి 55

తే॥ మలినసత్వ ప్రధానయౌ మాయగూడి
దేవుడే జీవుడను పేర దెలియనాయె
తెలివితో జూడ దేహియే దేవుఁడగును
రమ్యతరభోగి వేంకటరామయోగి 56

తే॥ ఈశ్వరుఁడె దేవుడని కొందరెంచుచుంద్రు
హరియెకొందరు దైవమంచందురయ్యు
లులనుపరిపూర్ణపరమాత్మ నెఱుగలేక
రమ్యతరభోగి వేంకటరామయోగి 57

తే॥ జీవుడావిద్యవశమున జేరుకతన
మూడుమేనులవాసనల్ గూడియుండి
దేహమేనేనటంచును దెలియుగాదె
రమ్యతరభోగి వేంకటరామయోగి 58

తే॥ మూడుతనువులలో జీవిగూడియుండు
మూడువేళలనామముల్ మూడుగలవు
విశ్వతైజసప్రాజ్ఞులై వెలయుచుండు
రమ్యతభోగి వేంకటరామయోగి 59

తే॥ స్వప్నమున తైజసుండను సంజ్ఞబరగు
యరసుషుప్తిలో ప్రాజ్ఞుడై యలరుచుండు
జాగ్రదందున విశ్వుడై సంచరించు
రమ్యతరభోగి వేంకటరామయోగి 60

తే॥ పంచవిషయంబులను వేరబరగుమాయ
యందులో పంచతన్మాత్ర లవతరించె
స్థూలపంచకమునుబుట్టె సూక్ష్మములలో
రమ్యతరభోగి వేంకటరామయోగి 61

తే॥ పంచభూతంబులై దేహభాగములుగ
జేసి యొకటితో నొక్కటి జేర్చుకతన
పంచవింశతి తత్వముల్ బరగెనవ్వు
లమ్యతరభోగి వేంకటరామయోగి 62

తే॥ పంచకోశంబులలో జీవిసంచరించు
వానిసంబంధ మాతనివదలకుండు
యజ్ఞుడైదుఃఖ సుఖములనందుచుండు
రమ్యతరభోగి వేంకటరామయోగి 63

తే॥ పంచప్రాణంబులను గూర్చి ప్రబలుతనువు
పంచవిషయంబులందులో బరగుచుండు
పంచకర్మేంద్రియంబులు పనులుసేయు
రమ్యతరభోగి వేంకటరామయోగి 64

తే॥ మనసుబుద్ధియు చిత్తంబుఘనముగాను
యులయహంకృతి యనునాల్గునలరుచుండు
దేహమునముఖ్యమంత్రులై దెలియువిని
రమ్యతరభోగి వేంకటరామయోగి 65

తే॥ మనసుబుద్ధియు చిత్తంబు మఱియువిన ము
ఘనయహంకృతిగ నాల్గుకరణములను
మానసంబిన్నిటికిరాజు మాయదారి
రమ్యతరభోగి వేంకటరామయోగి 66

తే॥ మలినసత్వంబుతోఁగూడి మానసంబు
ప్రకృతిమిథ్యయు విద్యనాబరగుమాయ
మూలయజ్ఞానమునకిదె మూలమగును
రమ్యతరభోగి వేంకటరామయోగి 67

తే॥ మాయసంసారమంతయు మానసంబె
జన్మకర్మాదులకు మానసంబెకర్త
సర్వసంసారమును మానసమునయడగు
రమ్యతరభోగి వేంకటరామయోగి 68

తే॥ మనసునిద్రలోఁజెంది తామునగుపడిన
లోకజాలంబులేమియు లేకయుండు
మనసునిద్రను మేల్కన్న మఱియుగల్గు
రమ్యతరభోగి వేంకటరామయోగి 69

తే॥ మర్కటంబునఁ బోలె నీమానసంబు
నిర్మలంబుగ బుద్ధిని నిల్వనీక
భ్రాంతిలోముంచి చిక్కులబరచుననఘ
రమ్యతరభోగి వేంకటరామయోగి 70

తే॥ మనసుసంసారసౌఖ్యంబె మంచిదనును
నంతకును మించుసౌఖ్య మింకేదియనును
నేనెసర్వంబునకుకర్త నిజముయనును
రమ్యతరభోగి వేంకటరామయోగి 71

తే॥ అనిలవేగంబుమించిన దవని లేదు
మారుతంబును నిల్పెడు మహిమలుండు
గానిమానసమును నిల్పు ఘనులుయరుదు
రమ్యతరభోగి వేంకటరామయోగి 72

తే॥ దుష్టకార్యంబులే మహాశ్రేష్ఠమనును
నిష్టభక్తిని దెల్పిన భ్రష్టుదనును
మహిమలన్నియు నేనంచు మనసుయనును
రమ్యతరభోగి వేంకటరామయోగి 73

తే॥ పలలము జూపి డేగను బట్టవచ్చు
నాకసంబునుయురిచేత నందవచ్చు
గానిమానసమును నిల్పు ఘనులుయరుదు
రమ్యతరభోగి వేంకటరామయోగి 74

తే॥ విద్యలెన్నియొగలవు యీవిశ్వమునను
యెన్నివిద్యలునేర్చిన నేమిఫలము
మనసునిల్పెడివిద్యయే మధురవిద్య
రమ్యతరభోగి వేంకటరామయోగి 75

తే॥ నారికేళంబునిలగోతి జేరినంత
ఫలముగల్గునె మిక్కిలి బాధగాక
మాయవిద్యలు నేర్చిన మనసునిలదు
రమ్యతరభోగి వేంకటరామయోగి 76

తే॥ ముగురుమూర్తులు మాయలో మునిగినారు
మునులునడవుల జేరి మనసునిలక
మాయనరులకు నేరీతి మనసునిలుచు
రమ్యతరభోగి వేంకటరామయోగి 77

తే॥ అడవిగజరాజు వాదంబునందు నైచి
చెలగియభ్యాసమున చెంతిజేర్చినటుల
మనసునిల్పంగజాలిన మహిమగల్దు
రమ్యతరభోగి వేంకటరామయోగి 78

తే॥ చెలగికంఠంబుశిరమున జీవుఁడుండు
నరయ దేహియు మరియక్షులందునుండు
ఫాలనేత్రంబులను నాత్మ బాయకుండు
రమ్యతరభోగి వేంకటరామయోగి 79

తే॥ ఏడుమందిరముల కొక్కఁ డిరుకు త్రోవ
సప్తమంబగు మేడలో చానయుండు
పడతిఁగూడినవాఁడే పరమయోగి
రమ్యతరభోగి వేంకటరామయోగి 80

తే॥ జగములోనున్నవానికి సఖియురాదు
చానఁగూడినవానికి జగములేదు
సఖియజగముల పాలించు జాణుఁడెవఁడో
రమ్యతరభోగి వేంకటరామయోగి 81

తే॥ కంటిపాపలో రంధ్రంబు కలిగియుండు
నందులోన యగమునుండి యలరునెఱుక
యది మహామాయాలశక్తికి నాళయంబు
రమ్యతరభోగి వేంకటరామయోగి 82

తే॥ సప్తమందిరములయందు సంచరించు
హంసయిరువదియొక వేలనారునూర్లు
దివము రాత్రి యీరీతిదిరుగుచుండు
రమ్యతరభోగి వేంకటరామయోగి 83

తే॥ సప్తమందిరముల హంసజపముసేయ
పంచుకొనుచుండ్రు యచ్చటిప్రభులుజపము
క్రమముగా నాయు వీరీతిగడచుచుండు
రమ్యతరభోగి వేంకటరామయోగి 84

తే॥ హంసయాధారమున జీవులలరుచుండ్రు
యదియుపీడినగాత్రముల్ గదలకుండు
నట్టిమంత్రంబుజపియించి యధికులైరి
రమ్యతరభోగి వేంకటరామయోగి 85

తే॥ ఇంటిలోపలిద్రవ్యంబు నెఱుగకున్న
ధనముయుండియుఫలమేమి తనకులేదు
హంసగానని మూఢుండున ధముడగును
రమ్యతరభోగి వేంకటరామయోగి 86

తే॥ హంసతోగూడివిహరింప హింసతొలగు
స్వస్వరూపంబులో జేరు సత్యముగను
యతడెయాత్మాభిరాముడై యలరుచుండు
రమ్యతరభోగి వేంకటరామయోగి 87

తే॥ రాజమార్గంబు యిదిమహారాజవిద్య
యిట్టియోగంబు వేరెద్దియిలను లేదు
యజపగాయిత్రి జపియించియధికులైరి
రమ్యతరభోగి వేంకటరామయోగి 88

తే॥ దృక్కు నెఱుకలభ్రూమధ్య దిక్కునిలిపి
రాకపోకలవీక్షించు రాజయోగి
చెప్పరానట్టితావును జేరునయ్య
రమ్యతరభోగి వేంకటరామయోగి 89

తే॥ మనసువాక్కును కర్మబు మమత యెఱుక
భ్రాంతివిడనాడి దివ్యమౌప్రజ్ఞతోడ
చెలగిద్వారకలోజూడు చిన్నికృష్ణు
రమ్యతరభోగి వేంకటరామయోగి 90

తే॥ హంసమంత్రంబుజపియించి యాత్మరాము
డగుచువాల్మీకిలోకంబు లభినుతింప
బ్రహ్మరుషియంచు ప్రఖ్యాతిబడసెనయ్య
రమ్యతరభోగి వేంకటరామయోగి 91

తే॥ రాకపోకలనెన్నడు లేకయుండు
నెఱుకమఱపుల నెన్నడు నెరుగకుండు
నన్నయటువంటి వస్తువునెన్నతరమె
రమ్యతరభోగి వేంకటరామయోగి 92

తే॥ ధరలోముప్పది యేడవతత్వమెరుగ
హంసతోజోడు గూడియునను దినంబు
తన్ను తాజూచుచుండెడి తంత్రికగును
రమ్యతరభోగి వేంకటరామయోగి 93

తే॥ అదియునిదియంచు వనరానిదది యెనాత్మ
చూపుచూడంగ రానట్టిచోటియాత్మ
మనసుకనుయందగా రానిమఱుగెయాత్మ
రమ్యతరభోగి వేంకటరామయోగి 94

తే॥ అదియునిదియంచు వర్ణింపనలవిగాదు
లోకములజోలి నెన్నడు లేకయుండు
జగములన్నియువీక్షించు సాక్షియాత్మ
రమ్యతరభోగి వేంకటరామయోగి 95

తే॥ లోకజాలంబుపరమాత్మ లోనబుట్టు
బ్రహ్మమయమందు జగములుబరగువృద్ధి
నరయపరమాత్మ లోలయంబాదుమాయ
రమ్యతరభోగి వేంకటరామయోగి 96

తే॥ గర్భముననుండు జీవులగానదబ్ధి
యిటులనేలోకజాలంబు లెరుగదాత్మ
జగములాత్మను వీక్షింప జాలవనఘ
రమ్యతరభోగి వేంకటరామయోగి 97

తే॥ శ్రేష్టబుద్ధియు పుష్పంబు చిత్తజలము
మనసుపంత్రంబు గర్వంబు ఘనఫలంబు
యాత్మపూజనుగావించు యతశమాని
రమ్యతరభోగి వేంకటరామయోగి 98

తే॥ గజముయుదియంచుబల్కినకట్టలేదు
కట్టయుదియంచుబల్కనగజములేదు
సర్వమునుబ్రహ్మమనిబల్క జగములేదు
రమ్యతరభోగి వేంకటరామయోగి 99

తే॥ అరయయజ్ఞానిమాయ యంచనునుజగము
బ్రహ్మవేత్తలుసకలంబు బ్రహ్మమాత్రము
సర్వమునుమిథ్యయేయైన సత్యమేది
రమ్యతరభోగి వేంకటరామయోగి 100

తే॥ ఆదియంత్యములేకను యఖిలజగము
లందుయిందును సందియంబెందులేక
బ్రహ్మమానందమయముగా బ్రబలియుండు
రమ్యతరభోగి వేంకటరామయోగి 101

తే॥ పరమసుజ్ఞానికిని పరబ్రహ్మమునకు
భేదమింతైనగలుగ దీపృథివియందు
బుద్బుదంబును వేరెయంబువులకరయ
రమ్యతరభోగి వేంకటరామయోగి 102

తే॥ కొమ్మలందలిపువ్వులు గోయుటయును
కన్నుగవయును మూయుటకంటెసూక్ష్మ
మరయసౌఖ్యంబు నమనస్కమభ్యసింప
రమ్యతరభోగి వేంకటరామయోగి 103

తే॥ ఉన్మనీరాజయోగంబు యుక్తముగను
దెలియబల్కితి గురువుచే దెలిసినంత
యధికసంగతులెఱుగ నోయార్యులార
రమ్యతరభోగి వేంకటరామయోగి 104

తే॥ సాధుసజ్జనులకు నమస్కారమయ్య
తప్పులుండినదిద్దుడీ తంద్రులార
పెక్కుశాస్త్రంబులెరుగనో పెద్దలార
రమ్యతరభోగి వేంకటరామయోగి 105

తే॥ సత్కవీంద్రుల కరుణారసంబుచేత
దేశికేంద్రునిపరిపూర్ణ దివ్యకృపను
తేటగీతలుజెప్పితి దెలిసినంత
రమ్యతరభోగి వేంకటరామయోగి 106

తే॥ పరమసద్గురు రాయమీపాదములకు
గీతపద్యాబ్జహారంబు ప్రీతితోడ
నర్పణముజేసినాడ నీవవధరింపు
రమ్యతరభోగి వేంకటరామయోగి 107

క॥ మంగళముదేశికోత్తమ
మంగళమిదె లక్ష్మణార్యమంజులచరణ
మంగళమంబాభగళా
మంగళమోయోగశక్తి మాంపాహిసదా

శ్రీలక్ష్మణాచార్యచరణారవిందార్పణమస్తు.

– ఓం తత్సత్ –

హంసయోగశతకము - సంపూర్ణము.